శ్లో॥ మారుతిం ప్రాహ వత్సాద్య త్వత్ప్రసాదాన్మహాకపే।
నిరామయం ప్రపశ్యామి లక్ష్మణం భ్రాతరం మమ॥
(అధ్యాత్మ రామాయణం 6-7.8)

వత్సా! మహాకపీశ్వరా! నేడు నీ కృపావిశేషము వ వనే నేను నా సోదరుడైన లక్ష్మణుని నిరామయునిగ గాం గల్గుచున్నాను.

వజ్రాంగబలి యగు ఆంజనేయు డొనరించిన యీ మహత్తర కార్యమును శ్రీరాముడు, పునర్జీవితమును పొందిన లక్ష్మణుడు ప్రశంసించుటయేగాక వానరభల్లూక వీరులందఱు నోళ్ళ పొగడనారంభించిరి. కాని అభిమానశూన్యుడైన ఆంజనేయుని హృదయములో ఎట్టి అహంకారము కలుగలేదు. తా నేమియు చేయనివానివలె ఆయన మిన్నకుండెను. అంతయు చేయువాడు మరియొకడు కలడని, ఆయనయే అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీరామచంద్రుడని, తాను కేవలము నిమిత్తమాత్రుడనని ఆంజనేయుని భావము. అతడు ఒంటరిగా, అందరినుండి దూరముగ నుండి మనస్సులో అరుణకమలములవలె ప్రకాశించు సుకోమలములగు ప్రభువుయొక్క చరణారవింద ధ్యానములో లీనుడయ్యెను.

ఇది శ్రీకృష్ణపరమాత్మ చరణారవిందమిళిందాయమాన మానసత్వ మహావైభవ సంపన్నుడు శ్రీ మట్టుపల్లి వేంకట మహాలక్ష్మి జగన్నాథుల తనూభవుడు భక్తజన దాసానుదాసుడు సుజన విధేయుడు నగు శివ సుబ్బారాయ గుప్త చే ప్రణీతంబైన శ్రీ హనుమద్భాగవతమందు పూర్వ భాగము సమాప్తము.

శ్రీ హరిః ఓం తత్సత్

